3 సారిగమ - గరిసగరిసని - పసనిపమ - రిగమగరిసా -
సామజభ - యహరసురముని - నుతచరణ - రిపుహరణ సా -
నిసరిగమ - రిమపని - మపనిదని - ససారిగరిసనిసీ -
రసనయాస - సఖియస - రసములల - సుధాంబుధిరవినరా -
పపాధనిధపమగా - రిరీగమగరినిసా .. నిసీప -
సుఖంబులనుగనరా - సుఖంచనిదితతిరా - పరాకు -
నిస - గరీమపని - సరిగ - సిసరి - పనిస - మపని - సనిపమ -
విడు - వరాతగుర - కమల - విరుల - సరుల - సమిత-ములనుస
గ - రిమపనిదనిసా - రిగమసా - ధనిసపా - రిగమసా
ర - సనిడెనుగనరా - పరమపా - వసకృపా - నిధివి సు -
రిమపనిదని॥ సా॥
బ్బకవివినుత॥ భా॥

పెండ్లికొడుకుమీద పాటలు.

70 ఖమాసురాగము— ఆదితాళము.

(పదివరో పాషిప్ప, మోస్తరు)

పెండ్లికొడక నీపెద్దతనమంత తెలసెను । పేరుప్రతిష్టకు తగినావులే । ఇంప్లవాంకిండ్లల్ల విసువకతిరిగేటి । వీరుడవు శూరుడవులే॥ పెం॥ మట్టిమెట్టెనను నామెద్దెగెలువగ । మానదనుచునీవు మాట్లాడెదా । ఘట్టిగ నేమునిగిన దెగంగయనుచును । గాండ్రించి గలగలనాదగొట్టెదా॥ పెం॥ ముచ్చటలగుపనులు ముగియకముందర । మొండికాలోక్కటి అడ్డాడెదా । నచ్చుగాను మొండిచేతులవానికి నువ్వులుదినునట్లునేర్పించెదా॥ పెం॥ హెచ్చులమారివై వేటపాలెముపోగ తన్నితలగుడ్డనుగీసిరిగ । యిచ్చకములింక విడిపించి వరఘాలి సుబ్బరాయార్చితుని సేవించుమేలుగ॥ పెం॥

## 71 ఆదితాళము.

(మగడైన మేనగలు, మట్టు)

ఇటువంటి పెండ్లికొడుకు నెక్కడజూడమే । యిటువినగదె యోయింసుముఖ యిదిచోద్యమే॥ ఇ॥ పిలువనిపేరంట్రములకును బిర బిరగనువచ్చు । చెలిచెప్పని వక్కపొద్దుకు అచ్చుగనడవడికలుహెచ్చు॥ ఇ॥ ఎక్కాడెక్కడ పెత్తనములకు నేగుదెంచునే । చక్కగతానక్క వినయము నెక్కడగాంచెనే॥ ఇ॥ గీచుబేరమాడునితని । గెలువరెవ్వ రు । పోచుకోలువాడని తెలిసిపిల్లనివ్వరు॥ ఇ॥ రాతికినాకు వాదమ నుచు । రంజలువాడట । నాతివినవె ఘూలి సుబ్బారాయనుతుగోలు వడట॥ ఇ॥

## 72. జంఝూటి—ఆదితాళము.

(నీకుయింకసిగ్గులేదా యింగ్లీషుచదువుచదివెదవా, మట్టు)

ఆహా పెండ్లికొడకనీకు । అరుణమమరెబాగుగా । ఊహింపగ లేకయింక । ఉచ్చారణకే వత్తువుగా ॥ఆ॥ పానకంబనుపేరుతోడ । పం చలబ్బెముందుగా । పూనిసూత్రము కట్టకమునుపె । కట్నమబ్బె విం తగా ॥ఆ॥ తలబ్రాలింక బోయకమునుపె । తగమధుపర్కములబ్బె నుగా । పోలగనాగబలిలో కట్టు । శిల్కుపంచలుచేరెనుగా ॥ఆ॥ బింక మింకదేలనీకేమింకశుల్కమమరునెుగా । పెంకెతనమదేల ఘూలిసుబ్బ యార్చితుడెరుగునుగా ॥ఆ॥

## ఆభోగిరాగం—ఆదితాళం.

(కుంటేవాడు వెంటనడువా, శైలి.)

తంటామారి పెండ్లికొడుకేమంటాడో తనకథవినియు । తుం టారినడతగునికనేనంటే వింటూనుండును మఱియు ॥ తం ॥ లాంఛనలే [ మియు జరుగుటలేదట । లాహిరిగామటనీకిక్షి । కొంచాపుకూటికి పాల్ప డి పంచాజేరిరి యీనర్కి ॥ తం ॥ ఘనముగ తమరనుకున్నంతటి తగు

కట్నములేమియు గాంచగ లేదట । వినవలె నింకాపీరలచరితము । వి
సువక సుబ్బార్చితుగొలువరట ॥ తం ॥

74 నాగానందినీరాగం—ఆదితాళము.

(పెంకితనము విడువుమిక, మ్మట్టు.)

పెండ్లికొడుకుచరితము నిదివినుడీ । ప్రియులందరుచనుడీ । కం
డ్లగనిస గసపడుభేషజమంతయు । ఘనులిటునేర్పుతో గనుడీ ॥ పెం ॥
స్కూలుకువెళ్లుదుననుచును చెప్పియు । షికారుబల్ చేసునుటా । మేల
నిసైకిలునెక్కియు యిలపడి । మోసంబనితలసోయడటా ॥ పెం ॥ కం
పెనీలకడకరిగియు వారాంగనలను తరుచుగ జేరుచటా । నొంపిపనులువి
చ్చలవిడిగాచేయుచు । సుబ్బార్చితు మదినెరుగడటా ॥ పెం ॥

పెండ్లికూతురుమీాది పాటలు.

75. కాంభోజిరాగము—ఆదితాళము.

(ఎంతమంచిదానవే పడిన, ఘణితి)

ఎంతమంచిపెండ్లికూతుర వే । హేళనతెగ జెందితి ॥ఎం॥ వింత
వింతగను జగమంతభేషుయనగ నో । రంతలపనులనెల్ల కొండంతలుచే
సి । తందాన్విందారగ కుప్పిగంతులతో వారివీరి । చెంతజేరిసంతస
ము నొందికుందెవింతలాడి ॥ఎం॥ ఘడియయైన నింటకాలు నిలిపియుం
డకగడప । గడపతిరిగె పూజసేయనీకు ఘనమౌ । సుడిపడినట్లు నడి
బజారులలోననీవు । విడిబడి విహరించెటి నీవిధము తెలిసె చాలునడతె।
ఎం॥ సారాసముఖిరో సానికత్తెలవేషము విడిసం । సారసరసతో డను
గ్న సంసారమాగదె । సారాము లేనివట్టి సాకూలచెంతనేల । సూరు
లైన ఘూలి సుబ్బరాయ వినుతుగొలుచుచుండ॥ ఎం॥

76. బేహాగ్ రాగము—ఆదితాళము.

(ఇకమానుముమానుము నీవీచింత, వలె)

ఓపెండ్లికూతుర నీవిటువినుమా ॥ నీ ॥ పండ్లుబెటికి పెట్టుదవది

ఘనమా । పూబోండ్లతో పాటిరావటనిజమా । కిగిగండ్లజూచిన చేర వేలగనుమా ॥ఓ॥ ఊహాపోహాలు లేకయుండునట । మొరలు । ఊత యిచ్చిన వినుకోవట । యెంతో । సాహసమును చేయనెక్కువట । యెంచి । చూడగపసిగోలవట ॥ఓ॥ చూడచిట్టిమెలుకవచ్చేచునక్కు । పట్టి । గోడలుత్రివ్వ పందికొక్కు । అనెడి । నుడితప్పక సిరుమొక్కు । ఘూలి । సుబ్బార్చితుదొరగడె సీదుటక్కు ॥ ఓ ॥

## 77. బ్యాండుస్వరము—ఆదితాళము.

(పూలబంతులాడెనే, మట్టు)

పేరుగాంచిపొంగకే । పెండ్లికూతురింతకే ॥ పే ॥ పౌరుషములు విడుమింతటంతో । పరువుకూడదిది యొక్కటిసో ॥పే॥ వరమాక్తికమర కితవజరి । హారములుగొని తెచ్చి । సురుచిరముగమీకివ్వగనిక । సొం పుగావటనిమాకిచ్చి । నవెచనగా నిదిసరిగా । దనియనగా । సతివడి గా ॥పే॥ మారకోటిసమతేజ। స్వరూపుడు । మందరధరునింకారుడు ధీరుడు । ఘోరపాపాణ పురవాసుడు ఖగ । సుబ్బరాయనుతు డవ్విధ గనుగొన ॥పే॥

## బానమీది పాటలు.

## 78. శంకరాభరణరాగము.

(గంగాధరసతి... మారిరి)

పెద్దబానగారిభూమైన వడితడు । వడతిలినగదే । ఒద్దికలేను సుద్దులుగూడియు రెడ్డిమె తేలుగదే ॥పె॥ వరువును నెంచక వదిలముంచక వదరుచుండునే । తారుమారుగా తారసిల్లుచు తెగపులెంచునే ॥పె॥ అర్ధములను పెడర్ధములుచేయుచు సర్దుమీఱునే । గార్ధభస్వరముతో గానముసేయుచు గంతులేయునే ॥పె॥ తగవులతాకట్లమరియును పేరు నుఖరనుపొందెనే । అగడుచేయుచు ఘూలి సుబ్బారావు కొలువకుండునే ॥పె॥

### 79. సురటరాగము—ఆదితాళము.

(పోపోపోం, శైలి)

బాలావినవె । బానసడతగనవె ॥బా॥ వాలాయము తనువంక లుశంకలు ॥బా॥ పలుకనువకరిలో । పనివడిపిలచిన । తొలగనుత్తమక డు । తన్నెన్నియాడిన ॥బా॥ తెలిసినదొరలకు । తెలియగజేయను । తెలియకున్నతను । తెలిసికోజాలును ॥బా॥ పాటుతప్పినవి । పనులన్ను న్నవి । కూటికిగుడ్డకు । కూడగరానివి ॥ బా ॥ గెలిచేసినను । గొలనిత లచను ఘూలి సుబ్బరా । ట్రాపులునిగొలువను ॥బా॥

నదినమీదిపాటలు.

### 80. ఖమాసురాగము—చాపుతాళము.

(శైలి కేశూరులు ; మోస్తరు)

చాల్ చాలీపాటలు । మేల్ మేలీమాటలు ॥చా॥ నిలువాలుగను వేల మేలచలమేల మేలములచెలరేగెదవదినరో ॥ చా ॥ నోటికెమును యీపిట లేరటని । సాటించెదవీతుళ్ళపాటునిటు ॥చా॥ కన్నవిన్నగన కున్ననిన్నుగను । చున్నవారమీవన్నెచిన్నెలివు ॥చా॥ పాటిగానునీపా టివారలీపాటిను డె నీ । మొగురుపాటువిను ॥చా॥ నిబ్బరమున ఖగసు బ్బన్నలినివిని । అబ్బురముగ తబ్బిబ్బులాడకిక ॥చా॥

### 81. కన్నడరాగము—రూపకతాళము.

(ఇతివ్యాపులమైనవి, ఘణితి)

మదిపొంగిపోకెనీవు వదినరో ॥మ॥ నగజాంగనానగాలచోటిన తలపోయువేల తగవేలనోల ॥మ॥ మిడి । మేలమైనసకల । లవి । చా లనీకుఘనత । విన । వేలతగినమాట । గణ । వేలమేంగను సేలపోల॥ ను ॥ విను । వారలంతనుగు । గను । నాకెనీప్రయోగ । యని । చేర బోకితగ్గు గానుండవేల గాకున్నచాల ॥ మ ॥ లవ । జాలికూడచేయు । తగు । మాలినట్టిపాపము । మిడి । ఘూలి సుబ్బరాయ । కనవంగనీను గాపాడశేయ ॥మ॥

## 82. హిందూస్తాని.

(మోహిరేపంకి, వలె)

అహాహావదిన అదురుటచాల్ । అదురూటచాల్‌నిక । బెదరూటమేల్ ॥అ॥ సాహాసములునీకు న్యాయంబెకాగా । మోహాము జేర ముందరవున్నట్టి ।మోటన్లనుపిల్చుకగా । మంచివేడుకగా । ప్రైగా మెక్కిపోగా । ధరణినెల్లతిరిగి ఘూలి సుబ్బయార్చునెరుగకున్న । వారు వీగిచరినిన్ను । ఛీఛీయన్నచెరుగవ్ ॥అ॥

## 83. ఆదితాళము.

(మేలారు, శైలి.)

వాటాక్ యుమాయింగ్ మైడియ్యార్ వదిన వాదమేలనే । ఇటీజ్ వాగా సెకన్ యీవిషయంబులు యింకచాలునే॥వా॥ ఆల్ దిరెల్ టివేన్ ఆశ్చర్యంబులు అన్ని అందికే । ఆల్ రైట్‌నీవిక అందలమెక్కగ అబ్బురంబులే ॥వా॥ దటీజ్ వెరిబ్యాడ్డను దానిని మనసుకుదాపునుంచవే । ఇటీజ్ వెరిగుడ్డని చెడ్డలు నీయిచ్ఛనెంచకే ॥వా॥ వటీయువర్ మాత్రిక చాలీసంగతి సంశయించవే । పుట్‌యువర్ వర్కుల ఘూలి సుబ్బరాట్పాలుగాంచవే ॥వా॥

## 84. బేహాగ్ రాగము—ఆదితాళము.

(వాసాంపు పెంపుదంపుగమరం మ, మట్టు)

సీ । మాటపాటఝూట నిలుపువదిన । యీ । నీటుగట్టిపెట్టవేలనింక మొదిన । చీటిమాటికి కాలుదువ్వనదన । చూడ । కోటాలు దాటు మాటలునోటివమున ॥ సీ ॥ సరసాములాడిన నింతతగవు । సరి దానవుగావని యంటవగవు । సరిసూాలు గనిరీ సఖ్యతవగవు । సరిసరి మాపాటినీవృతగవు ॥సీ॥ బోటినోటికి బుద్ధి తెచ్చుకొనుమా । తోటివారలజూచి మైనగనుమా । బూటకములవీడ సత్యమనుమా । పాటము శేలను సుబ్బయార్చితుగనుమా॥ సీ॥

### వదినమేలుకొలుపుపాట.

### 85. మలయమారుతము రాగం-ఆదితాళము.

(ధన్యుడేవ్వడో, మాదిరి)

మేలుకోగదే । మేలౌవదిన ॥ మే ॥ బాలసూర్యబింబముదయించె ప్రజ । లెల్ల కాలకృత్యములుదీర్చిరి ॥ మే ॥ కోకరవికెనుతులంట విడియున్న । కోరిచూడవచ్చె ప్రజలెల్లగు । నీకు యింక శిగ్గులేకయున్న దేల్ల । నీరజాక్షి. ఘాలిసుబ్బవినుతు డెరుగ ॥ మే ॥

### వదినదంతధావనముపాట.

### 86. అఠేరిరాగము.

(నాపాలిటి నేమియనునో; మట్టు)

నీపంట్లుదోముకొనుమా । కడ । గండ్లమాడివదిన । యిటు । కండ్లజూచి సరగునపూబోండ్లలో లేచి ॥ నీ ॥ మరదనొండిగనుమా । యిదె । సాగనారగొనుమా । కరుకుగలుగుబియ్యపు కనుసుచు । కర మరుమగనీకరమునందియు ॥ నీ ॥ రకరకపుభస్మమిదిగో । సభవగలు చాలువినుకో । వకసారియునాగచ్చపుల్లగొని । హాయిలుగ సుబ్బాచ్చి తుమదినెంచుచు ॥ నీ ॥

### వదినతలంటుపాట.

### 87. సురటరాగము - చాపుతాళము.

(భజోకలా; మట్టు)

రావేవదిన । తలంటెదనిటు॥ రా॥ రా॥ రా॥ ననవాగరికతయున గలమానెలు । యివెనొనినచ్చితివేవేగా॥ రా॥ తెల్లటికిసన్నపులు గొని వచ్చితి। కొల్లగళరమునజల్లగబూసెద॥ రా॥ జంటితేనెనెంపికపట్టును। కంటిపెయిదికలకంఠమో॥ రా॥ ఘాలిసుబ్బకవికృతిబొగను గొని। వళిసవిలోచనినాతీరో॥ రా॥

### వదిననలుగుపాట.

### 88. ఖమాసురాగము- జల్వాతాళము.

(మదుపులుగ్గైకొనుము దేవ, మాఱిరి)

జలజనేత్రి వదిననీకు నలుగులిడెదరాగదే। అలుకలువలదింక కులుకు తళుకుబెళుకులెంచవే॥ జ॥ విరివిగనరపుష్పకారములతోవ్రారె బాగుగా। నరయుగబహుసల్లజీడిరసముకలిసెవింతగా॥ జ॥ మంచిమరదగొండిచిత్రిమగాలములనుగాంచవే। ఎంచగనీభాగ్యమేమె వంచనటని యెంచకే॥ జ॥ చిలుకలకొలికింకశగ్గులేల లేచిరాగదే। ఘూలిసుబ్బరాయదాసకృతిని నందుకోగదే॥ జ॥

### వదినస్నానముపాట.

### 89. సురటరాగము- ఆదితాళము.

(పోపోపోర, ఫణితి)

రావేవదిన। స్నానముచేయుగ॥ రా॥ వేవేగమెజని। వేగిరపాటుతో॥ రా॥ కడుగును గంజియు। గలసిగుంటలో। విమువకనీవిక వేగమెనందులో॥ రా॥ మఱిజలదారులుగలవిటుచాలగ। మఱియునునంములో మునుగుచుమేలుగ॥ రా॥ పరిహాసమునకు బాల్పడగదవే। వరసుబ్బాభృతువరమునిగొలువవే॥ రా॥

### వదినచీరెలురవికెలుపాట

### 90. జంఝూటి - ఆదితాళము.

(శాశావయామని, వాసిరి)

చీరెలనందవె। చీరరవదిన। నేరములెంచకె। నేర్పరిజాణ॥ చీ॥ సోదరతో। చక్కగజేసిరి। బాగుబాగుయను। బోలునుసేసరి॥ చీ॥ జనసరలతో। రవికలునల్లిరి। అనయముగానిసి। వాదరించుతరి॥ చిత్రముగుతలు। కొత్తగచేసిరి। కొత్తగసికొర। కై నేయించిరి॥ చీ॥ మేలిమిసరిగ। మిన్నగబొల్చుచు। ఘూలిసుబ్బకవి నుతుస్మరియించుచు॥ చీ॥

వదినతలదువ్వ పాట.

91. ధన్యాసిరాగం- ఆదితాళం.

(తనిదరనుఖియా. మట్టు)

వదినరో యిటురా। తలదువ్వెద నే॥ వ॥ యిదెయదననిమః ముందు తలంచీ॥ వ॥ నీమునసెంతటి బిరుసైయున్నదో। నీకురులంతటి బిరుసేమే। అమగునుజనపనారంతటిసొబగిల। తామసమేలను గోదవలెనుండెనే॥ వ॥ వాసన జెందెటివేషచమురును। ఆ సిగలట్టియాపిచ్చిచమురు। భేషః గను చేరంపముదువ్వగ। చేసెదసుబ్బాప్పితు డెరుగగను॥ వ॥

వదినతిలకముపాట.

92. హిందుస్తానిరాగం.

(నచ్చుతజోనమోరి, కైలి)

తిలకంబు పసుపునీకు। తీర్చెదనవదినరాణె। తీవ్రింబులను నెంచు చున్॥ తి॥ బాలరావెరారావేగ॥ తి॥ నిరంతరంబును। నిజంబెరుంగవు। విరించివ్రాలెను। గన్। వరెన్। యికన్॥ తి॥ పరంగలట్టిఫల। రసంబు రకములు। ధరించుసుబ్బయ। కృతిన్। మదిన్। వినిన్॥ తి॥

వదినకాటుకపాట.

93. శంకరాభరణ- ఆదితాళము.

(ఈసరినీకిక, మాదిరి)

బూటకమేలనువదిన। కాటుకగొన పటతగున। చీటికిమాటికనిట నగును। మాటలు సాటగనీలగున॥ బూ॥ గూటిగూటిమసి తెచ్చి। వాట ముగా నూనెనుచేర్చి। మేటిగజల్లేడ్రిసమును జేర్చి। సూటిగనూతన సు న్నముగూర్చి॥ బూ॥ నీటుగకాకరపసరును పట్లె। రతులితముగజతపర్చి నూరితి। మేటియానువదరస్థూలిసుబ్బకవి। పాటనుబాడుచు బాగుగ రమ్మిక॥ బూ॥

వదినపసుపుపాట.

94. కాంభోజరాగం- రూపకతాళము.

(ద్వాదశిఏప్రిశమాచరించె, వలె)

భామినియిటురా వెరావెనదిః। పసుపుబూసెదనునే॥ భా॥ వాసినిగ నుచుండియును। వాసినిపీవక్రుచుబరగి। యీసుకరములెరుగవు దరహాస మునుల్లాసముగద॥ భా॥ పాదయుగిములిటునిమ్మా। పసుపుమర్యాదల నుగొమ్మా భేదబుద్ధిమదినెంచకుమా। భావములను గుర్తెరుగుమా॥ భా॥ లోపములెన్నున్ననుమా। లోపపుచ్చెదమే। కోపమేల ఘూలిసు బ్బ। రాయవినుతుమదినెంచవే॥ భా॥

వదినగంధంపాట.

95. కేతిగౌళరాగం- ఆటతాళము.

(సుందరాంగని, ఘణీతి)

గంధమందగిసందమానదినయిందురాగదే। యెందుజూచిః సుం దరినిమగః గునుచుండిరే। గం॥ దాక్షివకముల నన్ని తప్పకగలిపిరితార సిల్లకే। వావినిచూపగవచ్చిరివనితలువాదమేలనే॥ గం॥ మేలుగలుగుమ హాదాక్షినకిమున్నదిమేలమేలనే। వాలుగలిగిన నీహ్వాయలును గనిరింక వదలరునిన్నిపుహలే॥ గం॥ చిత్రిమూలపుగంధముతీసిరి చిత్రిమైయున్న దిలే। అత్రపహుటదేల దురిదగొండిరసము। మర్మకైయున్నదిలే॥ గం॥ కాయమరయగబంగారుకాంతినిగల్గి। కళలుట్టిపహుగాంచుమా। బాయక వది ఘూలిసుబ్బరాయదాస। పాటనుమదినెంచుమా॥ గం॥

వదినఅత్తరుపన్నీరుపాట.

96. ఆదితాళము.

(మతిసెరవమ్మితి, మాదిరి)

అత్తరుగొనుమిదె మేలుగావది॥ నాత్తరు॥ చిత్తముః నుచిగు। రొ త్తగమదితళు। కొత్తనునీవిటుగనుమావది॥ నాత్తరు॥ వన్నెచిన్నెల మ

రున్న వగునునీ। పన్నీరునుయిదెగొనుమావది॥ నాత్తరు॥ మేలగుఆయలు లన్నియుగ్రమ్మరె। ఘూలిసుబ్బకవి సూటిగావది॥ నాత్తరు॥

వదినపీడెముపాట.

97. సురటరాగం - ఆదితాళము.

(బనవాలీబసతామురారి, మట్టు)

ఇదెగొమ్మావదినావిడెంబు। యికయిదె॥ మోదముకూడ మోనియతి। చోద్యమూనదేల॥ ఇ॥ జిల్లేడాకులు। చింతగింజలును। కొల్లగతుమ్మయిగుళ్ళనుచేర్చి॥ మిదె॥ అలవాటులుమీకే వియొతెలుపుశి। అలయకమేమంపెదమతిత్వరగా॥ ఇ॥ ఘూలిసుబ్బకవి కృతిగలపాటలు। మేలనిపాడుచుమేలమాడుచును॥ ఇ॥

వదినహారానళిపాట.

98. శహానరాగం - ఏకతాళం.

(తమకమునిల్వ గరెంత, మట్టు)

అలుకలుమానుమువదిన। హారములేశెవమేు। పలువురుచూచినపరుపుగనుండును। పడతిరొసీకిదిపాటిగజెందును॥ అ॥ కుంకుమగింజల నూలల్। పొంకముగాగురిగింజల్। శంకలిడుమనిక వేపకాయలును। మంకులేలపల్లేరులుగూర్చెను॥ అ॥ నిండినవేడుకతోడన్। బెండులుచేర్చిచూడన్। అండజాక్షిదండలునీదండను। నుండెనుగను సుబ్బార్చితుమహిమను॥ అ॥

వదినఛత్రిముపాట.

99. శంకరాభరణరాగం - ఆదితాళము.

(ఈధనిహాపరసాధనమే, పలె)

ఛత్రిముబహుదుమువదినలురారే। ఆత్రిములనుగనుగొనుడికమీరే। సూత్రిములను గుర్తెరుగగలేరే। గాత్రిములకు సాకర్యముకోరే॥ ఛ॥ గాలికిమొండకుశోలసితిరా। గాసిలశ్రిమలను బొందితిరా। శోలితిరికన్న

స్థతజెందితిరా। చోద్యములనుగను శించితిరా॥ ఛ॥ పుల్లాకనిమదినెంచకుడీ। పుల్లయనుచు నిరసించకుడీ। పుల్లచుక్కలను కనుగొనుడీ। సున్నపు బొట్టులగని యిటుచనుడీ॥ ఛ॥ భేదములెంచుటకిదిమర్యాద। వాదములనువిడిపించుటచేద। సుదినంబిదియని తలచగరాద। సుబ్బరాయకవి కృతినివ్వగలేద॥ ఛ॥

వదినచామరముపాట.

100. బేగడరాగం- ఏకతాళం.

(ఏందు కేయరా, మోస్తరు)

చామరంబుతో। విసరెదానువదిన॥ చా॥ నల్లులూనుయీగల్ చీమలూను దోమల్। కొల్లగానుచేరె। రెవికెలోకిచేరె॥ చా॥ అధమమైనజంతు। జాలమూలమలముల్। సదమదించదేహ। మదురిమెళించ॥ చా॥ ధరనపీనచామ। రంబునిదిగొగనుమ। వరఘూలిసుబ్బ। రాయుపాటవినుమ॥ చా॥

వదినఅద్దముపాట.

101. అమీరుకల్యాణి- మధ్యాది.

(పంచతుండనత, ఘణితి)

అందరిలోనేనందగత్తెనే। అద్దముచూచుకొగదవేవదినే। ముంచుగనీకురుల్ చిందులుద్రొక్కెనే। మందురొనలుగురువిందువునిందున॥ అం॥ కొమ్మరొనినోటితమ్మలొనిరెల్ల। కమ్మపరిక్కలను గ్రుమ్మరుచుండెను। ఇమ్ముగహారముల్ చల్లాచెదరై। సమ్మతిమీరినలువైపులబారెను॥ అం॥ పరగగనీయద్దముమంచిదెకదె। పెంకుకుసన్నము మసిబొగ్గమరెను। సురుచిర మగునీసొబగులువదలెను। సుబ్బరాయకృతిసూటిగనొప్పెను॥ అం॥

వదినసభాతాంబూలముపాట.

102. సరసాంగిరాగం- జుల్వా.

(విందూలు చేసీరి గా, మట్టు)

తాంబూలమిచ్చితిమీ। గైకొమ్మానీనడతలనుమెచ్చితిమీ। డం బుమీరగవినోదంబు దేలెటివదిన। సంభావనిదెనీచర్యలన్ని టికనుచు॥ తాం॥ యెద్దెమద్దెనియంచకా। నీవావడ్డెవాడిని కదియగా। సొడ్డుకూడగ మీయన్నదమ్ములువచ్చి। తెడ్డుతీసుకొని నడ్డిరగదన్నగ॥ తాం॥ గడప పూజలుచేయుటల్। వడియంచును నాసిపరికాశించగన। మిడిమేలమిడి యేడవనగూడెననుచును। కడనుండివరఘూలిసుబ్బయార్చితుదలచి॥ తా॥

వదినలాలిపాట.

103. బేహాగ్ రాగం- ఆదితాళము.

(గోపీనందన, మాదిరి)

లాలీయూగుమీలాగున వదిన। జోలపాడెదను జోకతోమదిన॥ లా॥ పల్లేరుకాయలు। పానుపుపైన। కొల్లగతుమ్మ। ముళ్ళుచేకూడిన॥ లా॥ వంటిగనుండిన। కంటికికూరుకు। నంటలేదేమొనే। జంటనుతెచ్చె ద॥ లా॥ జాబులువ్రాసితివి। చేరిధారలిక। అబ్బురముగఘూలి। సుబ్బ యార్చితుదలచి॥ లా॥

వదినమంగళహారతిపాట.

104. జంఝూటి.

(మంగళమనిమంగళమని, మట్టు)

మంగళహారతులు గొనుమమాచినవదిన। రంగుగనీపాంగులు మామంగలతగున॥ మం॥ ఇరుగుపొరుగువారిచేరితగవులాడిన। వారుఆ గ్రహంబుతోడవచ్చియిచ్చిన॥ మం॥ కూరిమితో కామకులనుగూడి యుండిన। వారిసతులువిసుకుకొనుచు। యిచ్చుచుండిన॥ మం॥ వాసిమీ రఘూలిసుబ్బయార్చుకొలువవు। దేశమంతతిరిగిఅలసి శోలసిసేవు॥ మం॥

## వియ్యాలవారిమీది పాటలు.

### 105. ఖమాసురాగము—ఆదితాళము.

(వదినరో పాపిష్టి, మాదిరి.)

వియ్యాలవారెంత విర్రవీగుచునుండ్రో । వీరికథవింతలో వినగదరే । చయ్యాన అధికమౌ కయ్యాములను బెంచి । వెయ్యారువిధముల తో వేధించిరే ॥వి॥ బాధుత్వమునుగాని పరగగ నితరయే సంబంధమునుగాని పాటించిరే । అందరు అందరె అరకాసుమొదలుగ అంతతమ సన్నిధికె ఆహ్వానమే ॥వి॥ మానాభిమానములు మంచుకైనను లేవు । మానరుగావీరి మంకుశంకల్ । పూని పరువుమర్యాదల పూనికలను బాసి । పూర్ణముగ బూనెదరు పిరికివంకల్ ॥వి॥ కట్టివిరచినట్టి మాటలుట్టిపడచేసి సం । తుష్టలౌచునుండరెపుడు శిష్టభేషజమ్ । అట్టహాసములుమెండు సృష్టిజేయుపనులుబెండు । కొల్వరెపుడు ఘూలి సుబ్బరాయనుతు సంతతమ్ ॥వి॥

### 106. కన్నడరాగము—రూపకతాళము.

(ఆహా నేతాపనుంచ నాదుసేనుమా, మోస్తరు)

ఆహావియ్యాలవారి అంతు తెలిసెనే । అలివేణి ॥ఆ॥ మోహాటించి తిరిగెదారు । ముందువెనుక లెరుగబోరు । సాహసంబుచేసెదారు । సాగవుయేపనులుబారు ॥ఆ॥ లేత లేతసొర కాయల । చేతనైనవరకు శకల । మతులములుగ జేయువిధుల । మరువకగనిచేతురబల ॥ఆ॥ కాల రీతినెరుగబోరు కలసిమెలసియుండజనరు । ఘూలి సుబ్బయాఖ్యధీరు । గాంచరువీరొకటేరు ॥ఆ॥

## తలుపుదగ్గఱిపాటలు.

### 107. ఆదితాళము.

(రాకేందువదన, ఫణితి.)

తామారసదన । తలుపూ । దియుమా ॥తా॥ నామాటవినవే

లనే । విమలోజ్వలాంగిరో । తమినిర్ । నిలుపర్ । మమతర్ । గన కర్ ॥తా॥ మాధావతలుపు । దియనూ చనుమా ॥మా॥ రాధీకవ రుడావని । రహిపేరుజెందగ ॥ విధిగా । నదియా । నిదియే । విధియా ॥మా॥ చిగురుబోణిరోయిట్టి । చిత్తవిభ్రమలేల । తగవా । తగువా । నగవా । మగువా॥ తా॥ దేవాదిదేవయింత । దీరోక్తులేలనయ్య । తవ సే । వలునే । నవలర్ । విడితిర్ ॥మా॥ పతితోనీపౌరుషంబు । సతి బల్కశాస్త్రమంబు । పతియే । గతియా । పతియే హరియా ॥తా॥ కలతగునీమాటలాచె । చులకాన చేయతగున । జలధీ । శయన । జల జ । నయన ॥మా॥ మధిరాక్షిమాటలేల । మదితడవునిల్పజాల । ము దమా । రగనా । యెదనూ । గనుమా ॥తా॥ వేదాంతవేద్యదాశ । రథే ఘూలిసుబ్బరాయ । కవితా । వినుతా । చరితా । భరితా ॥ మా ధావతలుపు । విడితీరాగా ॥

108. హిందుస్తానిరాగము—ఆదితాళము.

(రాజకుమార, శైలి)

వాదములేలా । వదరుటలేలా । వాకిలిదిద్యోగదే । అదురును బెదురును కుదురుగవదలక ॥వా॥ చాలికలెమ్మా । సరగునపొమ్మా । తాలిమిమాలిమటే । తెలిసితెలియకను పలికినబెళుకగు ॥చా॥ ఇడాపు త్రినిన్ను విడానాడినే ఘుడియయెట్లు నడలనేర్తు । అడలికబడలిక సుడి వడి వెడలెడు ॥ వా॥ ఔరాయిూరీతిననుగారించుట । అహాసాహసమే మందుగ । ఫరగలగరితలు సురతులనరయర ॥చా॥ నళినాక్షియీవింత న్యాయంబటె । కేళికిరమ్మనవేమందునే । అలుకలుతళుకులు కులుకు లునిలసిల ॥వా॥ ఘూలిసుబ్బాఖ్యుని పాలించిన । శూలిసన్నుతనన్నులా లించుమా । జిలిబిలివల్లపుల తెలియుగతలపుమి ॥ వారిజనేత్రా । వర సరగాత్రి । వాకిలిదీసితిరా॥

## 109. ఆదితాళము.

(బాల బిరానరావేరావె బాలమేల, వలె)

భామ । కవాటమింకదియ్యవేలలేమ । సుమాస్త్రి బారికోర్వ సుగుణధామ । నీమదిన్ తామసమ్ । బీయడన్ । వీడీయున్ ॥భా॥ ఔరా । చరాకుజూపకిందులేచిపోర । ఖరారినీకుయింత చులకనేల । కోటిన్ । చేరిన్ । వాకిలిన్ । దియ్యనిన్ ॥కౌర॥ బోటి । వరాల మాటలాడురత్నపేటి । యిటేలసాహసంబువినయధాటి । మాటలన్ । పాటలన్ । నీటులన్ । మీటుచున్ ॥భా॥ జారా । మరాళమందగమనలెంమలేర । సరాసరిన్ నేనెదిక్కుధీర । ధీరతన్ । శూరతన్ । క్రౌర్యతన్ । జూపకన్ ॥ఔ॥ బాల । వసుంధరాతనూజసాధ్విచాల । కలంతలెచ్చుశేయనీకుమేల । చాలగన్ । లీలగన్ । వాలుగన్ । మేలుగన్ ॥భా॥ గోల । పరాకునెంచవద్దు కనకచేల । ఖలారిఘూలి సుబ్బరాయపాల । వాలుగన్ । మేలుగన్ । వాకిలిన్ । దీసితిన్॥

## 110. చక్రివాకముశాగము—ఆదితాళము.

(మంచిసమాయ, మట్టు)

వారిజనేత్రి । వరగాత్రి । వాకిలిదియవె । నేరుశేయ మేరగాదు నేరమెంచనేరబోకు ॥వా॥ వారిజనాభ । వరభూప । వాకిలిదియను ॥వా॥ నేరమెంచనేరబోను । సారసాక్షుచాలుపొమ్మిక ॥వా॥ మధురాధిపమదితాళగజాలను । మారుతూపులిటుచేరా । బాధలన్ని సదమదించనెంచక । వాదమేల శేదదీర్చిబ్రోవుము ॥వా॥ మధుసూధన సుఖగోష్ఠులుచు నీదగుయెదనుయెదనుగదియించి । మోదమొందు మధురవాణులందరు శేదదీర్చిఆదరింతువి పొమ్మిక ॥వా॥ తడవేలను విడనాడగపాడియ అడలిబడలికనువేడ।మోడిపోడిగనుపగూడు పడతుకవాడవాడలేదపాడివెడలెను ॥వా॥ మిడిమేలపునుడులాడెడి నడవడిపోడిమేడ రహిశేడా । వీడెమందినడతవీడెవడయున ఆడిపాడివేడిగూడుటిపువర॥ వా॥

సలినాక్షిరో పెంళ్లిదేలిస రాతిరెనికునాకు పొలిమేరా । గేలిదేల చెలిమి చాలవలిగొన జాలిదేలి కేళిశైలి తెలియగ॥వా॥ఫలితాంశము వెలిబుచ్చెద లాలితపోళిముంచుబలిహార । వాలిగర్వహరణశూలిసన్నుత ఘాలి సుబ్బరాయపాలచెలువుడ॥ వారిజనాథ । వరభూప । వాకిలిదీసితి ॥వా॥

## 111. హిందుస్తాని ముఖారి—ఆదితాళము.

(కాటుగయోభిచువా, మట్లు)

వాకిలిదియ్యగదే । వారిజదళనయనీ ॥వా॥ కోకిలవాణీనా కోరికదీర్చవె । లోకనాయకుడనుగనవే । నాకాధిపనుతుడను ॥వా॥ వాకిలిదియ్యనురా । వాసవహృద్వందిత ॥వా॥ శ్రీకరయీతరి సాకులదేలను । నీకథలనువింటి । నిజముగనుగొంటి ॥వా॥ చరితము తెలిసిరా । జాణవైన । సరసతజూపెదవా । సరసీరుహదళలోచని ॥వా॥ భోగిశయననీబాసలు దెలిసెను । యోగిహృదయనిలయా । అగజానుతసదయా॥ వా॥ మాటదప్పితనీ । మాయలుపన్నెదు । బోటిరొనీకిది తగదు । పాటిమెరుంగుదు ॥వా॥ నీటుకాడనీ । పాటెవరుందురు । బూటకమేలనురా । హాటకచేల ॥వా॥ అత్తరుయగరుసం । పెగవిరులివెగని । చిత్తముగనుగొనుమా । నిత్తరివినుమా ॥వా॥ ఘాలి సుబ్బాఖ్యా । కవినుతముఖ్యా । లలితతులితసౌఖ్యా । లాలితసౌభాఖ్యా॥ వాకిలిదీసితిరా । వారిజదళనయన॥

## 112. జంఝూటిరాగం—ఏకతాళము.

(చెండ్లాటలాడేచెలీ, మాదిరి)

తలుపూదియ్యవేబాలా । బాలా జాలా మేలానీవిల ॥త॥ తలుపూదియ్యనుపోరా । పోరా నేరా మేరాశీవర ॥త॥ వలపుపిలపలేను పిలుపులువినిన్ను । తలపూలమదినెంచుమా । భామా । లేమా । కోమా । లాంగిరో ॥త॥ వలపునిలుపకురాజు । తలపూలువినురాజా । పిలుపూలుగనివెళ్ళరా । మారా । కార । శూర । గేసార ॥త॥ మ

రుబారికోర్వను । మరుకేళికూడను । మరుమాటలాడాకవే । లేవే । రావే । నీవే । యీవేళ ॥త॥ వరదూడవౌనిన్ను । వాంఛించువారేల । నిరసించుటిదియేలరా । పారా । వారా । ధీరా । గంభీర ॥త॥ పరిహాసమేలను । పరుషంబులేలను । పరమాత్ముడనుగానలె । నారీ । కోరీ । జేరీ । నీరీతి ॥త॥ సరసతవర ఘూలి । సుబ్బరాయపాల । సరసంబులిక చాలురా । రారా । ద్వారా । మూనూ । దీసీతి॥

### 113. హిందుస్తాని ముఖారి—ఆదితాళము.

(గోదర నా సీత యేదీనలక్ష్మణా, వలె)

వాకిలిదియ్యావె వారిజలోచనీ । జోగతో వేడితి కోకిలవాణీ ॥వా॥ వాకిలిదియ్యాను వారిజనాభ । పాకారినుతనామ ప్రణవస్వరూప ॥ వా॥ ఆకులుపోకలు అరటిఫలాలు । చేకొనినిలచితి జేరీనన్నేలు ॥వా॥ లోకాధిపానిన్ను లోకూలుబలికే । వాక్యములనాలించి వినుపించ నలుకే ॥వా॥ కొంచాపుబుద్ధు లాలించాకుబాల । వంచనచేయూట యదినీకుమేలా ॥వా॥ లంచాములిచ్చి యీాసించిదరినున్న । చంచాలాక్షులవలపించుటమిన్న ॥వా॥ లేసిపోనట్టి యూహాపోహాము లేల । కాని నుతులవట్టి కథలేలచాల ॥వా॥ మానుగ వర ఘూలి సుబ్బాఖ్యవినుత । మానుమునీవా మానినులనడత॥ వాకిలిదీసీతి హ్వాయలూగరార ॥

### 114. హిందుస్తానిరాగం.

(బతియా, హమకీ, వలె)

తలుపూ,దియవే । తడవేలా కామినీ ॥త॥ జాలమేలా । సుగుణశీలా । మానిపాలా । ఇందిరా ॥త॥ తలుపూ,దియనూ । తగవేలాశ్రీకరా ॥త॥ చులకనేలా । తగవులేలా । పగలుమేలా । సుందరా ॥త॥ జాలమాదేలవినుమా । ప్రేమగనుమా । శ్రీరమా । శుభనామ, గుణధామ, తగవేలా, భామినీ ॥త॥ నేరమానుషులువినుమా । సతినిగనుమా । భారమా । వరనామ, జితకామ, నగలేలా, సుందరా ॥ త ॥

జాజులూ । విరజాజులూ । మల్లెపువ్వులూ । గాంచుమా। మొరవినుము, మదిగనుమ, ముకిపెంపుమోహినీ ॥త॥ శ్రీవరా । మనవివినరా । మన సుగనరా । శ్రీధరా । యిటుచనుమూ, నుడివినుమూ, సుబ్బాభ్యా । పోషణా॥ తలుపూ, దీసితీ । తడవేలాసుందరా॥

వధూవరుల నామధేయముల పాటలు.

## 115. తోడిరాగము—జుల్వతాళము.

(ఎంతకఠినమాపనే, మట్టు)

పేరుదెల్ప వేలనే । వారిజాక్షిమాతోనింత వాద మేలనీకువరుని। వాద మేలనీకువరుని ॥పే॥ పేరుయెఱుగబోరటె । సారసాక్షులార కాల హరణమేల నాకువరుని । కాలహరణమేల నాకువరుని ॥పే॥ పేరు తెలి సెట్టులయితే। పేరుచెప్పమనుచునిన్ను । ప్రేరేపణలుచేయుబూ పరి హాసకనుపణతిమిన్న ॥పే॥ తెలియట్టులయితెనేను । తెలియజేసెదా నువిను । నలిననేత్రియాకౌసల్య । నాతిముద్దుతనయుడనుచు ॥పే॥ చా లుచాలీ చతురిమను । చాలునుమా దతఘము। మేలమాడ వేళ గాను । మేలుగనీ ప్రాణవల్లభు ॥పే॥ పరగవినుడీ మీరుయజ్ఞ । పురు షుడీడిన పాయసమును । నారిజాక్షులు తినగకలిగిన । వరకుమారాన్ను దైసవాని ॥పే॥ ఎంతచెప్పినగానిసీను । స్వాంతమంచు వింతవిడవు । కాంతహంతమేలనీకు । కాంతుసుగుణవంతుడనఘు ॥పే॥ నాకునెలోకేశసు ప్రలకును । స్నానముచేయించి తుదను । చేరిజలముచుట్టుత్రిప్పి । రక్ష యనెడీ పదముమును ॥పే॥ ఏమిమాటలజాణనైతివె । యేమిసాగసు పతాకినైలివె । కోమలాంగికనిటుల వేళాకోళముమ వదలిచాల॥ పే॥ వినుడి తెల్పెద విభునిపేరు । వీనులకింపొదనఘీరు। ఘనుడు ఘూలి సుబ్బ రాయ । పోషుడు శ్రీరాముడుగదె ॥పే॥

## 116. ఆదితాళము.

(కర్పూరంపు హారతిదే, మూసరి)

గామసీదుభామపేరు । రహించి తెలుప సమయమిదె। కోమలాం

గులమేమునిదే । కోరితిమోహనూరనిధీ ॥రా॥ కోమలాంగులారనానుభా మపేసు నెరుగరలె । యేమిజాగులేలనింక । మేలమాడజొత్తురలె॥రా॥ కాలహరణమైనగాని । కఠినహృదయులనినగాని । చాలగాశ్రిమకలిగి ననీ । చక్కనినుడివినకవిడమూ ॥రా॥ వినవలెననిమీానునున్న । వినుడికనే తెలుపునది । జనకమహారాజసుతని । జగతినెవనుయెరుగరిది ॥కో॥ దశరథనరసుతుడనని । విశదముగను తెలుసునూకు । దశముఖహంత మానినుత । దశదిశదిక్పాలనేత ॥రా॥ పట్టుపట్టినారుగాన । పట్టువిడువమనగతగదు । పట్టుభూదేవియందు । పుట్టినట్టిపట్టియని ॥ కో ॥ వమిమాటలేమిసూటి లేమినీటులేమికేటు । స్వామిపరీహాసమును । సదమడించి సత్వరము ॥రా॥ నలిననేత్రులారనాకు । నాతిపేరు తెలిపెదను । ఘూలిసుబ్బారాయనుత । కామినిసీతాయటనుచు ॥కో॥

బువ్వంబంతిపాటలు.

## 117. ఆదితాళము.

(బువ్వమెంతో బహుచోద్యము, మోస్తరు)

బువ్వమెంతో బహుచోద్యము । సుదతీ । సుదతి ॥ బు ॥ రవ్వాలపీతాలపై పువ్వుబోణిరుక్మిణితో । మువ్వగోపాబాలుడుండగ ॥బు॥ రంభోర్విజాంబుల । జృంభణజాలుము । అంబుజాక్షి పందిరందున॥బు॥ సరసారసాన్నముల్ । సంఖ్యమీాఱుచిత్రాన్నముల్ । క్షీరాన్నములు శాకముల్॥ బు॥ ఊరగాయలూరుపిండ్లు । వరుగూలు పిండి వంటల్ । సరసమైనదధిఘృతముతో॥ బు॥ పులిహోరపేణీలతో,। హోళిగల్ సోమాసితో । ఘూలి సుబ్బారాయపోషని ॥బు॥

## 118. ఆదితాళము.

(మహారాజ శ్రీనివాస, ఫణితి)

మధురాక్షీమదనుజనకు బువ్వముమవినిగాంచుమమా । పృధివినెఱిశిట్టివిభవ మునుమను నెంచుమమా ॥మ॥ మునుకతెదీనవంక్తులటీమహిమమా.

డగా । గణుతి శేయజాలనమరగణముగూడెగా ॥మ॥ అత్తరులతోనలికిరి తళుకొత్తపందిరిన్ ।చిత్తములరగట్టిరి । చిత్తర్వులిత్తరిన్ ॥ మ ॥ చాలగ ముత్యాలముగ్గులతివలతిగ బెట్టిరి । పోలగనవరత్నస్థగిత పీఠములనువే సిరి ॥మ॥ రంగుగబంగారరీటాకులిటులబరచిరి । పొంగుచుఅంగనలు వడ్డనలను నెలమిచేసిరి ॥మ॥ సరసాన్నసూపశాకములును సరసపిండివంటలున్ । క్షీరాన్నముల్ పులిహోరలున్ । పొంగలిడ్డెనల్ ॥మ॥ ఊరగాయలూరుపిండ్లు నుండెహెచ్చుగన్ । వరఘాలి సుబ్బారాయ నుతునిగనవె యిచ్చటన్ ॥మ॥

## 119. ఆదితాళము.

(మగడైన మేనగలుయివ్వని, శైలి.)

అలివేణిగనుమతివిభవముగదె శ్రీహరిబువ్వము । శ్రీహరిబువ్వము। లలిసుందరము ॥ అ॥ పచ్చలపందిళ్ళకు జగిహెచ్చినమణితతులు। ముచ్చటగనువిధులు । ముఖ్యంబులుగుణవతులు ॥అ॥ చిత్తముచిగురొత్తగ ఘనచిత్తర్వులు చిత్రించీ । మొత్తముగనుపెంచీ। మునులుండిరి నడిగాంచీ॥ అ॥ సరసోక్తులపరిహాసించుచు సఖియలువడ్డనలనుచేయు। మురిపెంబులు గననీయు। ముదమొందగ శుభకాయ ॥ అ ॥ స్థిరమతి తోడుత ఘాలి సుబ్బరాట్సుతికృతిగనుపాడ। సురవరులందరు వేడ । సురుచిరముగ నిటుకూడ॥ అ॥

## 120. ఆదితాళము.

(బోరినజాలమేల, వలె.)

బువ్వమెంతసొంపా । గావే। సతీ॥ బు॥ రవ్వాలపీఠాలను । జవ్వసూలువేసిలక్ష్మి । మువ్వగోపాలు నుంచగ॥ బు॥ వంటకంబులన్నియు । వర్ణింపలేరుగ । కంటజూడగోచరమౌనుగ॥ బు॥ భక్ష్యభోజ్యలేహ్యా। చోష్యపానీయమ్ములల్ । లక్ష్యముంచిచేయువడ్డనల్ ॥ బు ॥ బాలికావహంబుల। కోలాహలంబుల। ఘాలి సుబ్బారాయపోషణ ॥

## 121. ఆదితాళము.

(వర్ణింపగాగలమా, మ్ము.)

వర్ణింపగనుతరమా । వినుమా । చనుమా । హరిబువ్వంపు బంతినిగనుమా ॥ వ ॥ కిర్ణకుండలధారుడేషు । వర్ణదేహుడువాలుకు దురగ। పూర్ణచంద్రిసమాన వదనతో । జూర్ణితర్ణిలోచనుగనుమరిరంభ। పర్ణములనెల్ల ముందునుంచిరి। సువర్ణమయమగు నిరంతరంబును శుభంబుసుఖంబు సుందరము॥ వ॥ సన్నబియ్యపన్నములును సూపములుశాకములును । యెన్నోరకముల పిండివంటలు । మన్నలుగిసి వడ్డనలతో । అన్నులమిన్నల్ వన్నెల చిన్నెల్ కన్నుల గనుగొన॥ వ॥ భూరిదక్షిణలిత్తురట శ్రీం। గారిమెచ్చగ గంధమత్తెరు । సారమగుఘనసారవీడెము । లరమరవిడిగొనగానిడె తటీగాన । వరగాలి సుబ్బరాయాఖ్యానుతువరదూసి॥ వ॥

### ఫలహారముల పాటలు.

## 122. కన్నడరాగము—రూపకతాళము.

(నమబోవిని సాంబ, మాదిరి)

ఫలహారములందు। పంకజలోచనరమ్మిదె ॥ ఫ॥ పాలుపంచదార పచ్చి। ద్రాక్షసీమరేగు కమల । ఫలములన్ని పసిడిపళ్ళె। రముల నుంచియిందుతెచ్చె ॥ ఫ॥ నిమ్మకద మామిడి దా । నిమ్మజామకిచ్చులు లును। సమ్మదమున నేరేడులు । సీతాఫలరామాఫల॥ ఫ॥ పనసపంప రపనసానాస । జా చేదిపాలవెలగ । ఘననారింజయు బత్తానారింజ యుగని రంజితముగ ॥ ఫ ॥ పుప్పుగుండూరీ పురేశ । పుదధిరాజసుతహృదేశ । మెప్పుగనుమ మధురభాష । ఘాలి సుబ్బరాయపోష ॥ఫ॥

## 123. ఖమాసురాగము—అటతాళము.

(సచిపరమన, మోహనము)

ఆరగించుము తారహారసుధీర ఫలహారంబుల । సూరిజనమం

దార భక్తవిహారవర రకరకముల ॥అ॥ వడలు అతిరసములును ఆమ।
వడలు బూందీహెూళిగల్ । కుసుములుప్పమా మినుపముద్దలు। కజ్జ
కాయలు బూరెలు ॥అ॥ లడ్డుజీలేబీ బంగాళాభాత్ । వంగీభాతులు ।
యిడ్డెలుమైసూరుపాకుదూది ఫెడాదోసెలు॥అ॥ బదరిఫేణీ।అమృతఫేణీ।
బర్ఫిహల్వాబొరుగులు । మధురమణుగుబూలుపకోడీలు కారంపూసలు॥
అ॥ సుఖియలటుకులు చక్కిలాల్ సుచిసుంద లిందునగ్రాంచుమా ।
సుఖదవన వర ఘూలి సుబ్బారాయ కృతినూహించుమా ॥అ॥

విదెములందు పాటలు.

24. ఆదితాళము.

(బుడబుడిమను నినదిమ, ఘణితి.)

మనుపులుగొనుమిదె మదనజనకవర । మందరగిరిధర మధుకై
టభహర। పుడమితనయ బెలుచుచున్నదిక తడవుసేయకను దయగని
కరవర ॥మ॥ పసందుగల వరపండుటాకులవి । పొసంగనొదగు పచ్చి
పోకలతి । గాసుగంధ ద్రవ్యములిందును నమరెను । వసుంధరాత్పతి
సుబ్బరాయనుత ॥మ॥

125. బ్యాండుసర్వరము—ఆదితాళము.

(నిమపధింతుదానవ, ...)

మనుపులందుమూధవ । మృదుమధుర బాషభూషిత । కమవడి
గినచేంద వా । సతికిడకుచనగజాలవ । విదెమింకచేయంగ సంకోజ
మూ । విడినాగటులుండ సముజనమా॥ మా। హెచ్చులేతయూకులు ।
మతిమచ్చుకిలుగుపోకిలు । అచ్చుజాజకాయలు । రుచిహెచ్చురోజయా
లకుల్ । పచ్చకర్పూరము మూక్తికాయుతి । సమ్మాన్నమిదె ఘూలి
సుబ్బన్ప్రతి ॥మ॥

126. కల్యాణిరాగం—ఏకతాళము.

(బాలరి వదేల, మప్పు.)

ఏమిమందుకొమ్మా । నీచేతనుగినుగొమ్మా। యూనుడసడిగైకొ

మ్మా! నిను। వేడీ! గూడీ! పడతులొచ్చిరివేగ॥ వీ॥ హెచ్చులేతయాకుల్। మతి। మెచ్చకలుగుపోకల్। రుచి। హెచ్చుజాజికాయల్ । సతులు। ముచ్చట। మీరాగ। తెచ్చివచ్చిరివేగ ॥ వీ॥ పారిజాతవినుమా । యీ నారీమణిని గనుమా। నినుకోరివచ్చెననుమా। జాపత్రి। ఘనసార। మృగమద। ములగూడిఁ ట్టి॥ వీ॥ చలమేలగోపబాల। సరసంబునందబాల। ఇల। ఘూలి సుబ్బకవిపాల। వీ । కులుకు । తానిటుగని । కులుకూచు । నిదె చ్చని॥ వీ ॥

## 127. కాంభోజి—ఏకతాళము.

(ఇక నేమందు నే చెలియా, వలె.)

ఘనసారవీడెమందుమా । ఓగానలోలరవికులవతంసమా॥ ఘ॥ పండుటాకులాను । పచ్చిపోకలాను । నిండుప్రేమతోడ। నిండినీకిచ్చేద॥ ఘ॥ పచ్చకప్పురము। పరగగమృగమదము। హెచ్చాగజాపత్రి। జాజికాయలతో॥ ఘ॥ కూరిమితోపచ్చి । కొబ్బరికురిడిని। గరిమనుసుగంధ। ద్రవ్యంబులతోడ॥ ఘ॥ సూటిగవర ఘూలి । సుబ్బరాయవినుత । హాటకచేలరవికోటిమోహనాంగ॥ ఘ॥

## 128. భువనరంజని—చాప్ తాళము.

(నాదుమనవి, మాదిరి.)

వీడెమొసగెతనసతికిఁ। వేడుకలనుగనివడిగ ॥ వీ॥ బంగగుపల్లెమునుగొనినంతఁ। రంగుగవక్కలులుఆకులుచేర్చిఁ ॥ వీ॥ జాజికాయజాపత్రియేలకుల్। తేజలవంగములందునఁదేలఁ॥ వీ॥ పంకేరుహదళలోచనుడింకఁ। కుంకుమపువ్వునుహొంకముజేర్చిఁ ॥ వీ॥ లాలితగుణుడతిలాలనచేసి। ఘూలి సుబ్బకవికృతివినిదాసీ॥ వీ॥

## పానుపుమీద బొమ్మవప్పగింతల పాటలు.

## 129. ఆదితాళము.

(కానక్షైతిసేతిమ, వలె.)

ఒప్పగింతుగైకొను । వంతవిడచిబాలను నప్పగానుమీరును

మేమువియ్యమందను ॥ఒ॥ కలిమిశేముతెంచక । కలసిమెలసిమంచిగ । బలిమిచెలిమినుంచగ । పలుకుపలుకుమెండుగ ॥ఒ॥ చాలినమాటలెంచ మేలు । గాలకాలమింతెచాలు । ఘూలి సుబ్బరాయపాలు । గాంచు చుండు సుగుణజాలు ॥ఒ॥

## 130. ఆటతాళము.

(అసావేరిరాగ, మట్టు)

వియ్యమంద । చయ్యానసీశాల గైకొమ్మచాల ॥వి॥ ముందు వెనుకనుచూచి। మురిపెములతనిసీ। అందాముగను మనమా । సంద ముగ వెలసీ ॥వి॥ మామాటమాదిగా । మీమాటమీదిగా । మీమది నవెంచక। మీమమిక్కిలిగా ॥వి॥ వలనొప్పజ్ఞాపకా । ధ్ధములుగలుగ గను । ఘూలి సుబ్బారాయ । కవికృతికడును ॥వి॥

## ఒప్పగింతల పాటలు.

## 131. ఆదితాళము.

(బహుశోకంబాయెను, మాదిరి.)

ఏలాగునంపూదీబాలామణీని । యీబాలామణీని । పసిబాలా నాఖనిసీ ॥ఏ॥ అలిసిలవేశిగుణజాలాగనీని। గుణజాలగనిసీ । వజ్రాలగనిసీ ఏ॥ కోకొకముకుజొచ్చ నిదికొత్తగనుక । యిదికొత్తగనుక । మతి మెత్తనవక ॥ఏ॥ పనిపాటలెరుగాని పసికూనను । యీపసికూనను । నీ నసిగందును ॥ఏ॥ ఘూలి సుబ్బాఖ్యాకృతి తేలీపాడగను । కృతితేలీపా డగను । మతిజాలిగూడగను ॥ఏ॥

## 132. కాఫీరాగము—ఆటతాళము.

(రాజాదుఃఖకారణంబు, మోస్తరు.)

అమ్మనిన్ను అత్తవారియింటికనిపెద । సమ్మదమున కీర్తితేగ సంతసించెద ॥అ॥ అత్తమామలాజ్ఞలకును అణగియుండుమమా । పెత్త నములకేగబోక పేరుగాంచుమమా ॥అ॥ ముందువెనుకలరయుక ముఖ

స్తుతులనందకే । కందవేశి కఠినమానసు చెందబూనకే ॥అ॥ నగుమొగ
మున నలుగురితో నగుచునుండవే । బిగువుసగజిబిజియు కఠినబింకమి
నువవే ॥అ॥ దేశకాలపాత్రములను తెలిసికొనగదే । శ్రీసుఘూలి సుబ్బ
రాయస్తుత్యు కొలువవే ॥అ॥

## 133. తోడిరాగము—జుల్వాతాళము.

(ఎంతకఠినమానసే, ఫణితి)

అమ్మపోయిరాగదే। ఇమ్మహినిట విడచియెటుల యుండను
నేనెరుగజాల ॥అ॥ సమ్మతిగామీఅత్తవారి। నెమ్మిభవనమునకు నేను ।
అమ్మజానికమ్మ భక్తసామ్మటుచు యెమ్మలాడి ॥అ॥ బిసరుహదళస
మనునేత్రి । అసదృశగుణసాంద్రగాత్రి । భాసలంను యశముననను
వాసిజెందుభాసురాంగి॥ అ॥ సాహసములెందుపీను । కూహాపోహాలం
దగూడు । బహుజనాళిమెచ్చ అహంభావమీడు మోహనాంగి॥ అ॥
కొరశిలపురీశుడఖిల । సాక్షిభూతుడతులయశుడు । ధీర ఘూలి సుబ్బ
రాయదాసనుతుడు జంటనుండ ॥అ॥

## 134. రూపకతాళము.

(నేటికినీగుణము తెలసెరా, మ॥ .)

నాసుతనిపెటులబో్రితువో రామ । వేసభాషనోసములను । మె
రుగనుగదరారామ ॥నా॥ వంటిగనిక విడచియెప్పుడు । యుండనుగదరా
రామ। జంటనెను వెంటనంటి । యుండునుగదరారామ॥ నా॥ మాయ
మర్మమెరుగనియు। మాయకిగదగారామ। బాయుసిభయభక్తితోడ। భా
సిలుగదరారామ॥ నా ॥ భారములనుగనుచుమెలగే । భామినిగదరారా
మ। సావధానమందునేర్పు। శక్తిగలదురా రామ॥ నా॥ లాలితాంగజాలి
బూని। పాలించుమురా రామ। ఘూలి సుబ్బరాయదాస। కవినుతవినరా
రామ ॥నా॥

## 135. ఆదితాళము.

(గౌతమవనమిది, ఫణితి.)

నాప్రియపుత్రినినయముగ నేలుమ। సుప్రసన్నహరిసూర్యవంశోత్తమ। అప్రమేయమునియాగసంరక్షణ। యోప్రియరాఘవయోఅభవా ॥నా॥ ఎక్కువశ్రీమలకుసేరనుసైపను। ధిక్కరింపులనుదరినుంచాదు। చక్కగనాజ్ఞలశిరముఁదాల్చి। అక్కజముగమదిలెక్కమెలంగును॥ నా॥ లీలలక్రీడనుదేలిఁబాలను। పోలగసాధ్విని। బోల్చగను। లీలామానుషదేహానుగ్రహ। ఘూలి సుబ్బకవినుతపదయుగళ ॥నా॥

### రాసక్రీడలపాటలు.

## 136. ఝ్యాంఝుస్వరము.

(రాసకేళివిలాసము, శైలి.)

రాసక్రీడలసల్పగ। రారెరమణులార వేగ ॥రా॥ హాసము దరహాసము మనోల్లాసముగదరే। వాసవార్చితుజేరి। వ్యాయలూగమది కోరి ॥రా॥ ఇంపులలచిసమనకును। బెండ్లబోల్చగవచ్చును। ఇంపుపోదరింపు పూబోంట్లుగాంచరే। కండ్లజూచిన పుడమిరేండ్ల వైభవమమరు ॥రా॥ సకలలోకనాథుడు సర్వసాక్షిభూతుడు। యేకమైరాకయున్న నుతులుసల్పక। సాకులేలను ఘూలి సుబ్బాఖ్యనుతుఁగోటి ॥రా॥

## 137. ఆదితాళము.

(నగుమోముగనుట బల్ సొగసుగ, వలె.)

రమణులందరమిటుచేరియు రాసక్రీడలసల్పుదమా। ఆహాబల్ క్రీడలుసల్పుదమా ॥ ఆ ॥ ర ॥ చక్రికోపుజడకోపుల వేయుచు చక్రిని కూడుదమా। ఆహాబల్ చక్రిని కూడుదమా॥ ఆ॥ ర॥ సైకతతిన్నెలపై వృక్షములవె సరసకుచేరుదమా। ఆహాబల్ సైగలుచేయుదమా। ఆ॥ ర ॥ ఘూలి సుబ్బరామాఖ్యపోషు శ్రీకృష్ణునిగాంచుదమా ఆహాబల్ కృష్ణునిగాంచుదమా॥ ఆ॥ర॥

138. హిందూస్తాని.

(దీలనహో బహారకా, మట్టు.)

రాసక్రీడాల దేలగారా వేమె నీవ్రుయింకసుందరీ ॥సుం॥ సుం ॥ సుం॥ సుం॥ రా॥ పొన్న పొగడాలు నారి । కేళాఖర్జూరతరుల । వన్నె లుచూచుచు । వన్నె చిన్నెలతో ॥రా॥ జాజిసంపెంగసన్న । జాజిరో జాలపొదల । తేజాముగాంచుచు తేకూవడాగూచు ॥రా॥ అక్రకుముద చంద్రాభ్యుదయుని వేడి । సార్థకముగ ఘూలి సుబ్బార్యుతునిగూడి ॥రా॥

జలక్రీడల పాటలు.

139. హిందూస్తాని.

(మిరెజో ఇకీతాం, మాదిరి.)

జలకేళినిదేలా జాగేలమేలా బాలరాగదే ॥బా॥బా॥ గంగాతరం గిణి తరంగపరంపర లుప్పొంగుట మదిగాంచి । రంగుమీరాగ । రాజ సమూగ । రాజీవాక్షీ రయముగ వీవు॥ జ॥ ఒకరొకరికరములు నొకరొ కరుపట్టుక నోపికమీరాగను । యేకముగాను । జోకమీరను । రాక పోకలన్ । కుమీరగన్ ॥జ॥ శ్రీరమ్యాంబగు మార్గశీర్షమున సరసముగ నీసరసజేరి । ధీరత ఘూలి సుబ్బరాయాఖ్య దాసపోషకుదరి జేరకోరి॥జ॥

140. ఆదితాళము.

(రమియించు మోహనాంగ, మోస్తరు.)

జలక్రీడసల్పుదామూ । జలజాక్షుగూడుదామూ । జతలూగ నే ర్పుడుదామూ । జలమునన్ దిగుమూ ॥జ॥ వినుమూ । చనుమూ । వాద మేలనే వేడుక గ్రాదుత । కొలనందుచేరియుందగన్ । కోర్కెలెల్లగూడ మొందుగన్ । మేనొనుము కునిచ్చుటన్ । మేలముల్ । నికవదలన్ । బాలా । చాలా । వాలుగ సుబ్బయవరదుని నిదెగని ॥జ॥

141. కురంజిరాగము—ఆదితాళము.

(శివదీక్షాపరురాలనురా, పజీతి).

జలకేళిసలుపాచసరే । యువజాగుసుందర విమునజాలరమై । జల

జాతుఁడిడు నాజ్ఞగై కొనరే। జాగరూకతలు మేలొనరె॥ జ॥ అలివేణులు కొలనుగనుగొనరే। అఘహరునికరము కరములకుజేర్పరె। సలిలమందున కేళిసలుపరరె। సారెసారెకు బిలువవలయునరె॥ జ॥ వివిధాభరణము లురమూనమెరయ। వివిధగతులతో చిత్రములరయ నవరత్నకంకణములు కరముల। నవహాయిద్యములుగ క్వాణముసలుప॥ జ॥ శుద్ధమైన మనసులబూనరే। పరిశుద్ధమాఘమాసముగనరె। వద్దిగాను మనసులుసిలుపరే। వరఘూలి సుబ్బార్ప్రితు మదిగనరే॥ జ॥

లాలిపాటలు.

142 (చాలుపో పదనము, రైకి)

లాలీపాడెదవిను। నలినాయతలోచని॥ లా॥ బాల। గుణజాల। వరశీల। రహీముద్దుబాల॥ లా॥ కొమ్మ। ముద్దుగుమ్మ। లక్ష్మమ్మ। రతనంపుబొమ్మ॥లా॥శీత।పూతచరిత।దాసభరిత। సుబ్బాఖ్యవినుత॥లా॥

143 కీరవాణిరాగము—ఆదితాళము.

(బోధవజాలమా, మట్టు)

లాలినూచెదా। నీలనీరదనిభాంగరంగనీకు॥ లా॥ బాలగోపబాలనందబాలముద్దుబాలనీకు॥ లా॥ సాక్షిరూపకా। మోక్షదీక్షపక్షితురగకరుణాకటాక్ష। అక్షిణకృపాకటాక్ష లక్ష్మిలోలశతృశిక్ష॥ లా॥ భూతలేశ్వరా। యతితలేశ అతులితగుణవిశేష। చతురాననజనక చతురచరితసకలమానిపోష॥ లా॥ నలినలోచన। వాలిగర్వసర్వభంగజలజనాథ। ఘూలిసుబ్బారాయ దాసకవితవంద్యకామరూప॥లా॥

144 బ్యాగ్ రాగం—ఏకతాళము.

(రా రాక్షీలోలా, మాదిరి)

భోగాంచితలాలీ। నాపాలీ। పెన్నిధిగుణశాలి॥ భో॥ యోగినిద్రియందేలెడినిన్ను। యోగాంచితుడందురి। సంగరయోగాంచితుడందురి। యోగాంచితుడందురి। తనయా। యోగులుగనుగొందురి॥భో॥

కాలిగజ్జెలు కడియములందెలు । గనముద్దులుగారా । జిలిబిలిగనముద్దులుగారా । గనముద్దులుగారా । తనయా । వినసుద్దులుమీరా॥ భో॥ ఘూలిసుబ్బకవికృతివినిబ్రోవ కరుణనుగనలేవా । బలిహరకరుణనుగనలేవా । కరుణనుగనలేవా । తనయా । కనికరమునుగావా॥ భో॥

## పుట్టినరోజు పండుగపాటలు.

### 145 ఆదితాళము.

(ఆయమగకర్పూరపు, మట్టు)

శ్రీహరియదుకులమునను జనించినదినమీసుదినముగాదాయో సతి॥ ది॥ శ్రీ॥ అరయగహరిజననంబుచతుర్దశ । భువనములకునామోదం । ధరసజ్జనులకు ననుకూలం॥ శ్రీ॥ నేడీయాసుదినంబునమరెనిక । వత్సరపండుగజేతము । బహుపుత్సవముల నొనగూర్తము॥ శ్రీ॥ ఎంతటిపున్నెమొ యెంతటిభాగ్యమొ । ఇంతులారతిలకింతము । సంతసమును గనుగొందము॥ శ్రీ॥ శౌరికిభూషణాంబరములువార్తము । విరులదండలనువేతము । కోరివేడుకలుచేతము॥ శ్రీ॥ తీయగకర్పూరపు హారతులెత్తుడము । ఘూలిసుబ్బాఖ్యునికృతము । పాటలుబాడుదము॥ శ్రీ॥

### 146 అటతాళము.

(ఇథరా జవదం, మాదిరి)

వరలక్ష్మిజననంబందెనే యీాదినముసుదినంబే । మనమందరమునిందే । వేడుకలుచేయగనిలెండే॥ వ॥ పుట్టినరోజౌటదీనినేడాది పండుగయంచును । మనమందరమునిటుచనుచును । వందనములను నిడుచును॥ వ॥ మణిభూషణాంబరములనునిడి సతినిగ్గైచేసి । రతనంపువేదికనువేసి । సఖకూర్చుండమనమటుడాసి॥ వ॥ కస్తూరిచందన మగరుపన్నీరత్తరులనిటుగూర్చి । పేరంటాండ్రములగూడి । జయ । మంగళములను బాడి॥ వ॥ ఇలఘూలి సుబ్బారాయకవినుత యింతివీవనుచు । విరు । లెల్లగనుమనుచు । మది । నుల్లసమగొనుచు॥ వ॥

## వరపూజపాటలు.

### 147 ఖమాసురాగం—ఆదితాళము.

(ఏవరంబులేలనో, మట్టు)

మేలనియీవరునిపూజ సల్పనేగుమా। జాలమేలకాలహరణ మీడగాంచుమా॥ మే॥ పాద్యార్ఘ్యాచమనములన్నియిచ్చియు। హృద్యంబుగ షోడశోపచారములర్పించియు॥ మే॥ నవవాద్యంబుల నులవిని మ్రోయించి। సవినయముగభక్తి శ్రద్ధలిందువహించి॥ మే॥ లాలితముగకన్నె నిత్తుననుచు చెప్పియు। ఘాలిసుబ్బరాయదాసకృతిని జేర్చియు॥ మే॥

### 148 కాఫీరాగం—ఏకతాళము.

(రామనేజటాయువు, మాదిరి)

వరునిపూజ శేయరారె వివరము లెరిగి। యీతరినిసరసముల చేవరుసనరణికినరగీ॥ వ॥ కానుకలను కట్నములను కరుణతోనిచ్చి। మానుగకన్నియ నిత్తుమనుచునుమెచ్చి॥ వ॥ పానకంబుబిందియలను పరగగనిచ్చి। పూనినూతనాంబరములిచ్చి పూనిక నొచ్చి॥ వ॥ ఉత్సవమును జరపి విడిదినదనముచేర్చి। ఉత్సాహముమీర సుబ్బయార్చితుగూర్చి॥ వ॥

## దంపతుల వర్ణనలపాటలు.

### 149 అఠాణరాగం—రూపకతాళము.

(సర్వేశ్వరుండపుడు, త్రైరి)

బ్రహ్మానందంబవునే ఈదంపతులనుగన। బ్రహ్మాజ్ఞావిస్ఫూర్తాంగులు భాసురాకారులను గనుగొన॥ బ్ర॥ సరసగానసాహిత్యములకును। సరస్వతీజలజాసనులనుబోలు। పరగగభోగములకతుల। శచిసంక్రందనులబోలు॥ బ్ర॥ బుద్ధిసూక్ష్మములకును బృహస్పతినిబోల్చగనువచ్చును। ఇద్ధరాయువులకును మార్కండేయులయనవచ్చును॥ బ్ర॥ మనముననూహింపగ శ్రీ। లక్ష్మీనారాయణులనొప్పు। మానుగనరుంధతివశిష్టుల మహాత్యములకరయనొప్పు॥ బ్ర॥ లాలితముగ దంపతుల

